# జమీన్ రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకటరామానాయుడుగారు

సంపాదకుడు: నెల్లూరు శ్రీరామమూర్తి

Regd. No. H. NL. 18
స్థాపితం: 1930
సంపుటి: 57 సంచిక: 4
4-4-1986
శుక్రవారం
16 పేజీలు: రూపాయి


# వెంగళరావు వైదొలుగుతారా?

రాజ్యసభ ఎన్నికలో కాంగ్రెస్ సభ్యుల క్రాస్ ఓటింగు; పదముగ్గురు కాంగ్రెస్ శాసన సభ్యులను పార్టీనుండి సస్పెండు చేయడంద్వారా క్రమశిక్షణ కాపాడాలని ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు

★ ★ ★

**వెంగళరావుగారి నాయకత్వం ఆశించిన ఫలితాల నివ్వలేదు- పార్టీలో నేడు ఆయన ఏకాకైనాడు**

★ ★ ★

శ్రీ వెంగళరావు అధిష్టానవర్గంపై తెస్తున్న ఒత్తిడి. ఆయనకు అండగా కేంద్ర మంత్రి శ్రీ శివశంకర్; ఈ సమయంలో అటువంటి కఠినచర్య రాష్ట్రంలో పార్టీని మరింత బలహీనపరుస్తుందనే శాసనసభ కాంగ్రెస్‌పార్టీ నాయకుడు శ్రీ బాగారెడ్డి వాదం; దానికి అనుకూలంగా మరో కేంద్రమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు వైఖరి; రాష్ట్ర కాంగ్రెస్ నాయకత్వంపై పొడసూపుతున్న అసంతృప్తి. వ్యతిరేకత.... ఈ పరిణామాలన్నీ చివరకు ఎక్కడకు దారితీస్తాయి? రాష్ట్రంలోని కాంగ్రెస్ వాదులనేగాక, రాజకీయ పరిశీలకులనందరినీ ఆలోచనలో పెడుతున్న ప్రశ్నలివి.

కాంగ్రెస్ శాసనసభ్యులలో అసలు ఎంతమంది కాంగ్రెస్ అభ్యర్థికి వ్యతిరేకంగా ఓటు చేశారు? అట్లా చేసినవారెవరు? కేవలం వూహలతో, వదంతులతో, అనుమానాలతో ఇంతమంది వ్యతిరేకంగా చేసివుంటారు. అందులో ఫలానిఫలాని వారున్నారనుకోవలసిందేగాని, ఖచ్చితంగా ఏ ఒక్క సభ్యునిమీద నేరం నిర్ధారణ చేయడానికి దాఖలా దొరకదు. అనుమానంతోనో, ఇతరుల మాటల ఆధారంగానో వేస్తే గుట్టుచప్పుడు కాకుండా,



మాట పలుకు లేకుండా, సైగ్గా పార్టీకి ద్రోహం చేసినవాడు దొరలాగా తప్పించుకోవచ్చు; తన అభిప్రాయాన్ని కుండ బ్రద్దలు కొట్టినట్టు ప్రకటించి వ్యతిరేకుడనిపించుకున్నవాడు నిజంగానే పార్టీకి ద్రోహంచేసి వుండకపోవచ్చు; అటువంటి నిర్దోషి చర్యకు గురికావచ్చు; దోషులను వదలి నిర్దోషులను శిక్షించినందువల్ల శాసనసభ్యులలోనేకాదు, కాంగ్రెస్ కార్యకర్తలలోకూడా పార్టీపట్ల, పార్టీ నాయకత్వంపట్ల నైరాశ్యభావం ఏర్పడవచ్చు; అది పార్టీని మరింత బలహీన పరచవచ్చు. ఈపరస్పర విరుద్ధమైన అభిప్రాయాలతో, వైఖరులతో రాష్ట్రకాంగ్రెస్ నాయకత్వం నిలువుగా చీలిపోయి వుంది.

శాసనసభలో కాంగ్రెస్‌పార్టీఉపనాయకుడు, మాజీ ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు డాక్టర్ వై. ఎస్. రాజశేఖరరెడ్డి విషయమే తీసుకుంటే, ఆయన వెంగళరావుగారికి వ్యతిరేకం; వుత్త వ్యతిరేకిగాడు, బద్ధవిరోధి. ఆయన ప్రకటనలు, వైఖరులుచూస్తే ఆయన, ఆయన వర్గీయులు పార్టీకి వ్యతిరేకం చేసివుంటారనే అనిపిస్తుంది. వారు చేయలేదని నమ్మించడం కంటే చేశారని వొప్పించడం సులభం. కాని రాజశేఖరరెడ్డి వ్యతిరేకంగా ఓటుచేయలేదని పార్టీలోని ఆయన వ్యతిరేకులేగాదు, నిష్పాక్షికులైన పరిశీలకులుకూడా గట్టిగాచెప్తున్నారు. అట్లనే తిరుపతి శాసనసభ్యుడు శ్రీ ముబ్బురామరెడ్డి; తాను కాంగ్రెస్ అభ్యర్థికే ఓటువేశానని పత్రికాప్రకటనచేశాడు. అనుమానితులైన ఇటువంటివారిస్థితి ఈ విధంగా

★ ★ ★

**క్రమశిక్షణ సమస్య- పార్టీలో అనైక్యత- ఈ కారణాలు చూపి అధ్యక్షత నుండి ఆయన గౌరవంగా తప్పుకుంటాడా?**

★ ★ ★

వుంది. అనుమానంతోనో, ఇతరకారణాలతోనో దోషులుగాని వారిని పార్టీనుండి

—కొరవ 10వ పేజీలో

# జమీన్‌రైతు

## కోన రాజీనామా

మహారాష్ట్ర గవర్నరు శ్రీ కోన ప్రభాకరరావు పదవినుంచి తప్పుకోక తప్పలేదు; ప్రజలలో పెల్లుబికిన నిరసన జడికి తల్లడిల్లిపోక తప్పలేదు. 'అనారోగ్య కారణాల'తో గవర్నరు గిరికి రాజీనామాచేసి ఇల్లుచేరడంతో, కోనచేసిన తప్పులన్నింటికి పరిహారం జరిగిందనుకోవడం పొరపాటు. ఆయన రాజీనామా, దేశంలో గవర్నర్ల వ్యవస్థ మనుగడపై ఒక నిర్ణయం తీసుకోవలసిన సమయం ఆసన్నమైందని గుర్తుచేసింది.

మహారాష్ట్ర మాజీ ముఖ్యమంత్రి శ్రీ నీలంగేకర్ కుమార్తె చంద్రకళ, మార్కుల కుంభకోణం వుదంతంలో కోన ప్రభాకరరావు వ్యవహరించినతీరు, గవర్నర్ పదవి పరువుతీసింది. ఈ విషయమై హైకోర్టులో దాఖలైన కేసు అఫిడవిట్‌ను వెనక్కు తీసుకోవడానికి, లాయర్‌ను మార్పించడానికి ఆయన చూపిన తహతహ అంతింత కాదు. ఇందుకు నిరసనగానే బొంబాయి వైస్‌ఛాన్సలర్ శ్రీ గోరె రాజీనామాచేశారు. ముఖ్యమంత్రి, వైస్‌ఛాన్సలర్ తప్పుకోవడంతో తాను బ్రతికిపోయానని మొదట మొదట కోన ఊహించారు; కాని విశ్వవిద్యాలయం సెనేట్ ఆయన్ను, ఆయన చర్యను అసాధారణ రీతిలో అభిశంసించడంతో మహారాష్ట్రనుంచి నిష్క్రమించక తప్పలేదు.

గవర్నరు పదవిఅంటే పూర్వం విశ్రాంతికి, విలాస జీవితానికి నెలవుగావుండేది. సరోజినినాయుడు వంటివారు ఆ పదవికి ఒక హుందాతనాన్ని, అపరిమితమైన గౌరవాన్ని చేకూర్చిపెట్టారు.

అయితే ఇటీవలికాలంలో రాజకీయ నిరుద్యోగులకు గవర్నరు వ్యవస్థ ఆశ్రయస్థానమైపోయింది. ప్రజాజీవితంలో ఒడిదుడుకులకు లోనైనవారు, ఆటుపోట్లకు గురైనవారు, అవినీతివంటి ఆరోపణలున్నవారు, పదవీతృష్ణ తీరనివారు గవర్నర్లు కావడంవల్లనే ఈ వ్యవస్థ ఇంత వివాదాస్పదమౌతున్నది; చులకనైపోతున్నది.

గవర్నర్లు, విశ్వవిద్యాలయ వ్యవహారాలలో అనవసరజోక్యం చేసుకొని, భ్రష్టుపట్టడం మహారాష్ట్రకే పరిమితంకాలేదు. మధురై కామరాజ్, వెంకటేశ్వర విశ్వవిద్యాలయం వైస్‌ఛాన్సలర్ల నియామకంలో; హర్యానాలోని మహర్షి దయానంద విశ్వవిద్యాలయం మెడికల్ ఎంట్రన్సు మార్కుల కుంభకోణంలో ఆయా గవర్నర్లు రచ్చకెక్కారు; పశ్చిమ బెంగాల్‌లోకూడా అదే జరిగింది.

గవర్నరు పదవిలో నియమింపబడే వ్యక్తులు ఉన్నత ప్రమాణాలకు కట్టుబడినవారై, నిజాయితీపరులు, నిష్కళంక వర్తనులైనప్పుడు, ఈ రాజ్యాంగ నిర్దేశిత మహోన్నతపదవికి ప్రతిష్ట, గౌరవం దక్కుతాయి; సాదాసీదా రాజకీయ నాయకులకు నెలవైతే, ఈ వ్యవస్థపట్లనే ప్రజలలో ఏహ్యభావం పెంపొందే ప్రమాదంవుంది. కేంద్ర నాయకత్వం ఇది గ్రహించి మెలగడం ఎంత అవసరమో, విశ్వవిద్యాలయాలలో గవర్నర్ల పాత్ర, ప్రమేయాలపై స్పష్టమైన, నిర్దిష్టమైన సూత్రావళిని రూపొందించడంకూడా అంతే అత్యవసరం.



# జమీన్ రైతు

### 3.4.1936

**ఒంగోలు జిల్లాబోర్డు!**

**కాంగ్రెస్ విజయము**

మార్చినెల 30 తేది ఒంగోలు జిల్లాబోర్డు సమావేశము జిల్లాకలెక్టరు గారధ్యక్షతన జరిగెను. కాంగ్రెస్ అభ్యర్థి కాసు బ్రహ్మానందరెడ్డిగారికి 17 ఓట్లును, జస్టిసుపక్ష అభ్యర్థి జాగర్లమూడి చౌదరిగారికి 12 ఓట్లును వచ్చుటచేత బ్రహ్మానందరెడ్డిగారు గెల్చిరి.

**సి. ఆర్. రెడ్డిగారు**

ఆంధ్ర విశ్వవిద్యాలయ వైస్‌ఛాన్సలర్ పదవికి సి. ఆర్. రెడ్డి, సర్ వేపా రామేశం, వి. తిరుమలరావు, తోట వెంకటసుబ్బారావు గారలు నామినేషనులు దాఖలుచేసి యుండిరి. ఓట్లు తీసుకొనుటకు ముందుగా తిరుమలరావుగారును, తోట వెంకట సుబ్బారావు గారును తమ అభ్యర్థిత్వములను ఉపసంహరించుకొనిరి.

సంతాన నిరోధ ఉపాసకుడగు రామేశంగారి కన్నా బ్రహ్మచారియగు సి. ఆర్. గారే మేలనికాబోలు రెడ్డిగారికి 40 ఓట్లును రామేశంగారికి 25 ఓట్లును వచ్చి సి. ఆర్. రెడ్డిగారు ఎన్నుకొనబడిరి.

విశాఖపట్నంజిల్లా యను పేరుతో నుండును.

**నూతన విశాఖపట్నంజిల్లా**

గంజాం, విశాఖపట్నం జిల్లాలలో కొన్నిభాగములు ఒరిస్సా రాష్ట్రమున చేర్చబడెను. మిగిలిన భాగములు

**మిస్ శ్రీరంజని**

మిస్ శ్రీరంజని నెల్లూరు శ్రీరామా ఫిలిమ్సు కంపెనీవారితో 19-12-35 తేదీన అగ్రిమెంటు వ్రాసుకొనెననియు. ఈ అగ్రిమెంటు ప్రకారము 1936 జూలై వరకు ఇతర కంపెనీలలో పాల్గొనకూడదనియు, ఆ తేది వరకూ శ్రీరామా ఫిలిమ్సు కంపెనీవారి ఫిల్ములను మాత్రమే ఫిల్ము 1 టికి రూ 1600 వంతున తీసుకొని ఆక్టు చేయవలెననియు, మా అగ్రిమెంటుకు విరుద్ధంగా లేక పిక్చర్ కంపెనీవారు తయారు చేయుచున్న శశిరేఖా పరిణయము ఫిల్ములో జోక్యము కల్గించుకొనుచున్నదనియు, అందువలన కాంట్రాక్టు ప్రకారము ఆమె ఇతర

## 50 ఏళ్ల క్రితం ఈవారం

చోట్ల ఆక్టు చేయకుండు నటులను, వేలు పిక్చరువారలు ఆమెను చేర్చుకొనకుండు నటులను ఇంజక్షను ఇవ్వవలసినదిగా శ్రీరామా ఫిలింస్‌వారు హైకోర్టులో పిటిషను దాఖలు చేసిరి. ఇంజక్షను ఇవ్వబడెను.

**బోర్డు ఉపాధ్యక్షుని నిరంకుశ ప్రవర్తనము**

సభ్యుని 'నా న్సెన్సు' అనుట - విడి కాగితములమీద తీర్మానములు వ్రాయుచుండుట- అర్జను మోషను వ్రాయ నిరాకరించుట.

నెల్లూరు జిల్లా బోర్డు సమావేశం 30 తేదీన ఉపాధ్యక్షులగు రా. సా. పాణకా గోవిందరెడ్డిగారధ్యక్షతన జరిగెను. ఈనాటి కార్యకలాపములలో జరిగిన ముఖ్య విషయాలు.

ఆరోతేదీనాడు లా మెంబరుగారికి జిల్లాబోర్డు అడ్రసు సమర్పించవలెనను తీర్మానమును శతికవేసి కల్మణబాబు గారెదిరించిరి. సభ్యులకు పది దిన ములు నోటీసు లేదనియు, ఈ కారణము మీదనే లోగడ బాబు రాజేంద్రప్రసాదుగారికి అడ్రసు ఇవ్వవలయునను తీర్మానమును బోర్డువారు త్రోసివైచిరనియు ఆక్షేపించెను. వారి ఆక్షేపణను ఉపాధ్యక్షుడు ఓవర్‌రూల్ చేసెను. తీర్మానము ఓటుకు పెట్టబడి నెగ్గెను.

రెండవ విషయం బోరు హోలు మెట్రిన్సు కాంట్రాక్టు. జిల్లాలో బోరు హోలు మెట్రిన్సుకుగా ప్రభుత్వము వారు రూ 9000 లు బోర్డుకు గ్రాంటును ఇచ్చిరి. దీనితోకూడా జిల్లాబోర్డువారుకూడా రూ 2000 లు ఇవ్వవలెనని హెల్తు ఆఫీసరు గారు కోరియుండిరి. ముంగమూరు విశ్వనాథరావుగారు ఈ మెట్రిన్లకు టెండర్లు కోరబడినవా అనియు, అట్లు చేసినచో మిగులు ద్రవ్యమునే బోర్డువారు గ్రాంటుగా నివ్వకూడదా యనియు ఉపాధ్యక్షుని అడిగిరి. అట్లుమిగిలినను బోర్డువారికామొత్తము రాదని ఉపాధ్యక్షుడు తెలిపెను. విశ్వనాధరావుగారు ఈ కాంట్రాక్టును గురించి కొన్ని విషయములు తెలిసికొనుటకై ఉపాధ్యక్షుని ప్రశ్నింప మొదలిడిరి. అంతట ఉపాధ్యక్షుడు మండిపడి, కంట్రోలుచేసుకొని, రావు గారు మాట్లాడేది 'నాన్సెన్స్' అని చెప్పి, ఆయన మాట్లాడకూడదని 144వ సెక్షను ప్రయోగించిరి.

ఉపాధ్యక్షుడు మినిట్సుపు తీర్మానములను పుస్తకములో వ్రాయక చిత్తు కాగితాలమీద వ్రాయుచుండిరి. ఇట్లు వ్రాయుట చట్టసమ్మతము కాదని రావుగారు ఆక్షేపించిరి.

# ఓట్లకు రాయలసీమ-తర్వాత వట్టిసీమ!

నెల్లూరు జిల్లాలోని వెంకటగిరి, సూళ్ళూరుపేట, నాయుడుపేట, ప్రాంతాలు, తిరుపతి పార్లమెంటరీ నియోజకవర్గంలో చేరివున్నాయి. తిరుపతి ఎంపిని రాయలసీమ నాయకులు తమప్రాంతంవాడిక్రింద జమకట్టుకుంటారు: అయితే ఉద్యోగాలో, మరొక అభివృద్ధి కార్యక్రమమో ప్రస్తావనకు వచ్చినప్పుడు ఈ ప్రాంతాలవారిని సర్కారుసీమకు చెందినవారిగా పరిగణించి దూరంగా నెట్టేస్తున్నారు.

అంటే ఓట్లు కావలసివచ్చినప్పుడు మాత్రం వెంకటగిరి ప్రాంతీయులను వాడుకుని, తర్వాత వట్టిచేతులు చూపుతున్నారన్నమాట.

అసలు అవసరంబడి ఎంపిని కలుద్దామంటే. ఈ ప్రాంతాలవారెవరికీ ఆయన దర్శనభాగ్యమే దొరకదు. రాయలసీమ, నెల్లూరు తేడాలవల్ల మేము ఎంత నష్టపోతున్నామో చెప్పతరంకాదు.

అందువల్ల తిరుపతి పార్లమెంటు నియోజకవర్గ ప్రాంతం ప్రజలందరినీ రాయలసీమ వాసులుగా పరిగణించి ఉద్యోగ, అభివృద్ధి కార్యక్రమాలలో రాయలసీమ వాసులతో సమానంగా అవకాశాలుకల్పించడమో; లేదా ఈ ఓటర్లందరినీ నెల్లూరు ఎంపిక్రిందకు మార్పుచేయడమోచేయాలి! అప్పుడు మా సమస్యలపై పోరాడడానికి నెల్లూరు ఎంపి అయినా మిగులుతారు.

అసలు రాయలసీమ, సర్కారు అనే తేడాలులేకుండా మొత్తం రాష్ట్రం అభివృద్ధి!. అవసరాల ప్రాతిపదికపై పని

### జనవాణి

చేయగలిగిన మంచిరోజులువస్తే ఇంకెంత బాగుంటుందో!

కాళహస్తి ఎ.వి.ఎస్. హనుమంతరావు

### నెల్లూరులో పశువుల బెడద

నెల్లూరుటౌనులో పశువులబెడద పెరిగిపోయింది. ఏరోడ్డుచూసినా మందలు మందలుగా తిరుగుతూ, పాదచారులకు వాహనాల రాకపోకలకుకూడా అంత

(కాగా 10 వ పేజీ)

# పెండ్లిండ్లు

## సౌత్ మోపూరు పెండ్లి

నాటలో, నకకలో సామ్యవాదైన కమ్యూనిస్టు: సౌత్‌మోపూరు హైస్కూలు [illegible]; నిరంతర ప్రజాసేవాసక్తుడు శ్రీ [illegible] దశరథరామయ్య కుమార్తె [illegible]కుమారి బి. ఎస్‌సి., గూడలి, శ్రీ [illegible] రామస్వామి కుమారుడు సర్వేశ్వరరావు, బి.టెక్., ఎం. ఇ: వివాహం 26తేది విజయమహల్‌లో జరిగింది.

## చిం తోపు పెండ్లి

చింతోపు మాజీ మునసబు, వొడిదుడుకులు లేనిరైతు శ్రీ మాగంటి బలరామ రెడ్డి కుమార్తె యశోధర: స్వర్గీయ పునుగుంట శివకోటారెడ్డి కుమారుడు వినయ కుమార్ వివాహం 26 తేది . బ్లూ [illegible]హాలులో జరిగింది.

## కావలి కళ్యాణం

రిటైర్డ్ తెలుగుపండితుడు, చేయితిరిగిన పత్రికావిలేఖరి, కావలి యులకు గురుతుల్యుడు శ్రీ కేసరి సుందరరామ శర్మ తనయ వెరపతి; ముంగమూరు, శ్రీ తిప్పావఝ్ఝుల రత్నయ్య కుమారుడు సత్యనారాయణ పరిణయం 26 తేది కావలి హోల్‌సేల్ వస్త్రవ్యాపారుల సంఘభవనంలో జరిగింది.

## ప్రెస్ ఓనరు పెండ్లి

నెల్లూరు పార్వతిప్రెస్ ఓనరు, అంటి ప్రెస్‌వర్కరుగావుండి ఓనరైన స్వర్గీయ [illegible] పిచ్చయ్య కుమారుడు శేషగిరి రావు: చెన్నూరు, శ్రీ చదలవాడ వెంకట కృష్ణయ్య కుమార్తె మధుసూదన కుమారి పెండ్లి 27 తేది వధువు ఇంట జరిగింది.

## 'రాజేశ్వరి' వివాహం

నెల్లూరు- రాజేశ్వరి పేపర్ ఎంపోరియం, గిరిజ గోల్డెన్ పబ్లిషర్స్ యజమాని శ్రీ సి. వీరభద్రరావు కుమారుడు వీర వెంకట రాజేశ్వరరావు: సూళ్ళూరుపేట, శ్రీ కోట చెంచురామయ్య కుమార్తె రాజ్యలక్ష్మి వివాహం 27 తేది గిడ్డంగి వీధిలోని రామానుజకూటంలో జరిగింది.

—తరువాయి 12వ పేజీలో

# ★ ★ నా మాట ★ ★

- రోడ్లలో రౌడీల ఊరేగింపు
- రంగడి తిరునాళ్లలో తగ్గిన "ఛార్మ్"

టౌన్ సర్కిల్ ఇన్స్‌పెక్టర్ శ్రీ మురళి తరచు వార్తలకెక్కుతుంటాడు. మాటలో దురుసు. చేయివిసురు. చేసే ప్రతిపనిలో పరుషదనం....మున్నూరులా బ్రిటీషు సంస్కృతిని పుణికిపుచ్చుకున్న పోలీసు అధికారి ఆయన. టౌనుకు ఇప్పటికి ఎన్నివందలమంది సర్కిల్ ఇన్స్‌పెక్టర్లో వచ్చిపోయుంటారుకాని, ఇంతగా వివాదాస్పదులైనవారు కొందరే!

మురళి టౌనుకువచ్చినప్పటినుంచీ, అలజడే! రౌడీజాన్ని అణచడంలో ఆయనకు ప్రఖ్యాతికల్గింది. విజయవాడ అర్బన్ ఎస్. పి. వ్యాస్ కూడా ఆయన కూడా రౌడీలపట్ల కఠినంగా వ్యవహరించారు. దీనితోపాటు రిక్షాలు, తోపుడు బండ్లవంటి సన్నగాళ్ళపై అతిగా చేయి, నోరు పారేసుకున్నారన్న అసంతృప్తి వున్నా- రౌడీజం, బ్రాకెట్లాది దుర్వ్యసనాల అదుపులో ఆయనకృషి, ఈ అసంతృప్తిని కనుమరుగుచేసిది.

అయితే ఇటీవల కొద్దికాలంగా మురళి పేరు వినపడటంలేదు. ఉన్నాడా లేడా అన్నంత నిశ్శబ్దంగా వుండిపోయాడు. ముఖ్యమంత్రో, హోం మంత్రో వచ్చినప్పుడు మాత్రం హడావుడిపడుతూ, హూంకరింపులుచేస్తూ తాను తత్తర పడుతూ, ప్రజలను బిత్తరపెడుతూ కనిపిస్తాడు.

ఇంతకాలం సైగ్గావుండిన సి. ఐ. ఇప్పుడు మళ్ళీ వార్తలకెక్కాడు 29తేది ఉదయం నలుగురు పిల్లరౌడీలకు గుండు గీయించి, బ్రాయర్లు మాత్రం మిగిల్చి, సర్కస్‌లో జంతువులను తిప్పినట్లు, టౌనంతాఊరేగించాడు; అంగడిఅంగడికి ఆగి వీళ్ళ ముఖాలు చూపించి, తనదైన భాషలో పరిచయంచేసి. వారి పరువు దీశాడు.

ఈ నలుగురు పిల్లరౌడీలూ ఇటీవల పొగతోటలో రౌడీ మామూళ్ళు దండుకొని బ్రతుకుతుంటారట; ఇవ్వనివాడిపై సోడా

## డోలేంద్ర

బుడ్లతో దాడిచేసి, లాంగదీసుకుంటుంటారు. అక్కడి పరువు పరిమితమైపుంటే [illegible]. సామ్రాజ్య పెద్దింటా [illegible] కోఆపరేటివ్ సెంట్రల్ బ్యాంక్ [illegible] జొరబడ్డారు. [illegible] మొగ్గలోన తుంచడానికి మురళి [illegible] ఎన్నుకున్నాడట.

పాము చిన్నదైనా పెద్దకర్రతో కొట్టాలన్నట్లు, పిల్లరౌడీలకుకూడా పెద్దశిక్ష విధించడం మంచిదే! అయితే అందుకు కోర్టులు, చట్టాలు చాలవా అన్నది ప్రశ్న. ఎమర్జెన్సీ రోజుల్లో ఇటువంటి దృశ్యాలు సర్వసాధారణంగా వుండేవి; మామూలు పరిస్థితులలో కూడా పోలీసులు చట్టం పరిధి అతిక్రమించి, శిక్ష విధించే అధికారంకూడా దత్తత చేసుకోగలుగుతున్నారంటే తెలుగుదేశం ప్రభుత్వం వారికి అంత చనువిచ్చినట్లు లెక్క.

పిజానికి కోర్టులో బెయిల్‌పొందడం, అంగిట్లో చాక్లెట్ కొన్నంత సులభంగా వున్న ఈరోజుల్లో, రౌడీలవంటి సంఘ విద్రోహశక్తుల అదుపుకు పోలీసులు కృతిమించి వ్యవహరించక తప్పదు. కాని, ఒకసారి పోలీసులకు ఈసంస్కృతి అలవడితే, రేపు సాధారణ నిందితుల పట్ల, అమాయిక ప్రజలపైనా ఇదేమంత్రదండం ప్రయోగించరని నమ్మకమేముంది? ఈమధ్య పోలీసులు మ[illegible] చేసినా, చెతుచేసినా, ప్రజలనుంచి ఎటువంటి ప్రతిస్పందన వుండటంలేదు. అది భయమో, తమకెందుకులెమ్మనే అనా

—తరువాయి 14వ పేజీలో

# సముద్రతీరగ్రామాల్లో సేద్యానికి తిలోదకాలా?

జిల్లా రైతాంగంపై ప్రకృతి కొత్త కోణంనుంచి విరుచుకుపడుతూంది. తుఫాన్లు, వరదలు, ఉప్పెనలు, కరువు కాటకాలతో దశాబ్దంపైనుంచి దెబ్బమీద దెబ్బగా దాడిచేస్తున్నా కసితీరనట్లు పగ బట్టినట్లు వ్యవహరిస్తూంది.

సముద్ర తీరానికి చేరువగావున్న రాముడుపాళెం, కుడితిపాళెం, గంగపట్నం మైపాడు ప్రాంతాలలోని సుక్షేత్రమైన మాగాణి భూములు చవిటిపర్రలుగా మారు తున్నాయి. ఫిల్టర్‌పాయింట్లువేస్తే, పాపా గాంచంటి ఉప్పునీటిని గ్రక్కుతున్నాయి. తీరానికి దాదాపు రెండుకిలోమీటర్లవరకు ఇదేపరిస్థితి.

భూగర్భ జలంలో మార్పు రెండు, మూడేళ్ళ క్రితమే ప్రారంభమైనా, ఈ సంవత్సరం అది విషమరూపం ధరించి నట్లుంది. రాముడుపాళెంలో పరిస్థితి మరీ దయనీయం. వేసిన పైరు వేసినట్లే ఎండి పోయాయి మొక్క ఎదగడంకాని, గంట కట్టడంకానీ జరగలేదు. ఫిల్టర్ పాయింట్ల నీరు పారిస్తే, తగలబెట్టినట్లు మలమల మాడిపోతుంది. పైరుకు ఏటికాలువ నీరు పారించినా, మొక్క ఎదుగుతున్నదికాని, వెన్ను దశకు వచ్చేసరికి తరక తేలిపో తూంది. ఎకరానికి నాలుగు తూములు గట్టిగింజ నిల్చే పరిస్థితి కూడా లేదు, ఇంకొక ప్రక్క కలుపు విపరీతంగా పర్తుందట.

ఆ గ్రామాల రైతులగోడు ఏనేతలైనా, విని అర్థంచేసుకునే మనసు వుండాలేకాని, ఎవరికైనా గుండె నీరౌతుంది. బంగారు పండాల్సిన భూముల్లో పైరు ఎండిపోయి, చీపురుపుల్లలవలె గాలికి ఊగులాడుతుంటే, రైతుకడుపు తరుక్కుపోదా? గుండె రాతి బండగా మారదా?

ఈవైపరీత్యం, ఇక్కడికేపరిమితమో? లేక జిల్లాలో ఇతరప్రాంతాలుకూడా ప్రమాదంలో పడనున్నాయో. తెలియదు. అదేజరిగితే రైతాంగం తట్టాబుట్ట నెత్తిన పెట్టుకొనివలసపోవలసివస్తుంది. తుఫాన్లు, వరదలకంటే విషపూరితమైన ప్రకృతి శాపం ఇది. తుఫానుకు పర్యం తుడిచి పెట్టుకపోతే, మరుసటిఏడు పైరుపండుతుంది. కానీ, అసలు నేలే చవుడుదేరిపోతే, నీళ్లు ఉప్పబడిపోతే శాశ్వతంగా సేద్యంపై ఆశ వదులుకోవలసిందే!

> సుక్షేత్రాలైన మాగాణి భూములు
> చవిటి పర్రలుగా మారుతున్నాయి-
> భూగర్భ జలం ఉప్పుమయమౌతుంది!

రైతు ప్రముఖు ఇంత సంక్షోభంలో పడిపోతే, భవిష్యత్తు ప్రశ్నార్థకంగా మిగిలిపోతే, వ్యవసాయశాఖకికాని, మరొక జిల్లాఅధికారికికాని కనీసం చీమ కుట్టినట్టుకూడాలేదు. రెండేళ్లనుంచి ఈ గ్రామాల్లో ఈ సమస్య సంచలనం కల్గిస్తుంటే, ఒక్కఅధికారికూడా కనీసం దుర్భరచూపుగాపోయి, ముఖం కూడా చూపించిరాలేదట. సహించరాని, గర్హించదగిన నిర్లక్ష్యం ఇది.

కలెక్టరు, వ్యవసాయశాఖ ఉన్నతాధి కారులు తక్షణం ఆ గ్రామాలకువెళ్లి, పరిస్థితి పరిశీలించి, జలపరిశోధనలో నిపుణులైన శాస్త్రవేత్తలను రప్పించి, ఈ వైపరీత్యానికి కారణా లన్వేషించడం, నివారణోపాయం కనుగొనడం జరగాలి! ఇది విషజ్వరంవలె తక్కిన ప్రాంతాలకు ప్రాకకుండా, ముందుజాగ్రత్త చర్యలు తీసుకోవాలి!

# కావలి దేశం సభలో నాయకుల కీచులాట

కావలి తెలుగుదేశంపార్టీ, సభ్యులు రచ్చకెక్కారు. ఇంతకాలం డాక్టర్ ప్రభాకర నాయుడు అటు జిల్లా కార్యదర్శి త్వాన్ని, ఇటు టౌను అధ్యక్షతను వంటి చేత్తో అవలీలగా నడిపిస్తుండినారు; కానీ కొరుపరవులు వద్దన్న, అన్నగారి హితవు ననుసరించి 31 తేది టౌను పదవికి రాజీ నామా గోకారు.

తనకు లేకపోయినా, తనవారికి పట్టం గడితే చేతికింద పడివుంటారన్నది నాయుడుగారి తహతహ అట; అందువల్ల ఆయన ఆ సమావేశంలో, పనిచేయని సభ్యులను తొలగించి, కొత్తవారిని చేర్పించినతర్వాత ఎన్నిక జరుపుతామని చెప్పారట. కానీ, శాసనసభ ఎన్నికలలో దేశం అభ్యర్థిగా పోటీచేసి, ఓడిపోయిన శ్రీ ఎం. వి. నారాయణ అందుకొప్పుకోక ఇప్పుడే ఎన్నిక పెట్టితీరాలని పట్టుబట్టా రట, అంతే, మీటింగులో రచ్చ రేగి పోయింది.

నాయుడుపక్షం కొందరు, నారాయణ వైపు మరికొందరు చేరి వాక్ఘర్షణతో తన్నెత్తికొక, చొక్కాలు మడిచి, పైపైకి దూకారట; బలాబలాలు ప్రదర్శించారట. ఈ సందట్లో ప్రభాకరనాయుడు మినిట్స్ పుస్తకం చంకన పెట్టుకొని, సైగా బయట పడి, కారెక్కి తుర్రుమన్నారట. వెంటనే మిగిలిన 20 మంది సభ్యులూ కలిసి ఎం. వి. నారాయణను అధ్యక్షుడుగా ఎన్నుకున్నట్లు ప్రకటించి, కొత్తమినిట్స్ పుస్తకం రాశారట.

## జిల్లావార్తలు

### గూడూరు మునిసిపల్ ఉద్యోగాలకు మోక్షం

కౌన్సిలర్ల మధ్య పంపకాలు, వాటాలు కుదరక, ఏడాదినుంచి వాయిదాపడుతూ వచ్చిన మూడు ఉద్యోగ నియామకాలు 1 తేది జరిగిపోయాయి. ఇవి పెద్ద ఉద్యోగాలుకూడా కాదు - ఒక నర్సు, ఇద్దరు ఆయాల పోస్టులు; ముష్టి మూడు నియామ కాలకు మునిసిపాలిటీకి ఇన్ని నెలలు పట్టింది.

అయితే ఇదికూడా సాఫీగా జరగ లేదు, గత సమావేశంలో వాటాల లో తేడాలొచ్చి, కినుకతో కౌన్సిలర్ పదవికి రాజీనామాచేసిన శ్రీ వెల్లి రఘురామయ్య ప్రీత్యర్థం. ఆయన కొకటి, ఛేర్మన్‌కు మరొకటి ఇచ్చేశారని, తమకు పట్టిచేతులు చూపారని, మరిద్దరు కౌన్సిలర్లు-కమ్మిటి వెంకటసుబ్బయ్య, నక్కా పెంచలయ్య-

—కొరవ 9వ పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు

(6వ పేజీ కొరవ)

వారనను బలపరచి, అధికారులను మంద లించారు.

రాష్ట్రాల సమితి వేసినాపిలో అంగన్ వాడీల మంజూరుపై రామనారాయణరెడ్డి అధికారులను నిలదీశారు. తమను అడగ కుండా, తమ నియోజకవర్గాలలో రోడ్ల నిర్మాణానికి చేసిన ప్రతిపాదనలను రామనారాయణ, మంత్రిచేత ఉపసంహ రింపచేయగల్గారు.

జిల్లాలో 44 పంచాయితీలలో తెలుగు మహిళా బహిర్భూమి పథకంక్రింద మరుగుదొడ్లు కట్టడానికి కోటి 24 లక్షలు మంజూరుచేశారు.

## వి. ఆర్. కాలేజి ఎన్నికపై స్టే

వి.ఆర్. కాలేజి కమిటీలోని రెండు స్థానాలకు జరగవలసిన ఎన్నికల ఫలితా లను నిలిపివేస్తూ, నెల్లూరు సబ్ జడ్జి శ్రీ లక్ష్మీనారాయణ స్టే మంజూరుచేశారు. ఎన్నికలకు రూపొందించిన నూతన నియమావళి చెల్లదంటూ, బి. జె. పి. సభ్యులు కోర్టులో దాఖలుచేసిన సూట్‌పై, న్యాయమూర్తి ఈ తీర్పు చెప్పారు. ఎన్నికల కార్యక్రమం మొదలైందికాబట్టి ఓట్లన్నింటినీ సీలువేసిన పెట్టెలలో భద్ర పరచి, లెక్కింపును కేసు పరిష్కారం వరకు వాయిదా వేయాలని ఆయన తీర్పు చెప్పారు. ఈ కేసులో బి. జె. పి. పక్షాన శ్రీ జూపూడి యజ్ఞనారాయణ, కాలేజి తరపున శ్రీ గోపాలాచారి వాదించారు.

ఓట్ల లెక్కింపు జరిగి కొత్త కమిటీ ఏర్పడేవరకు పాత యజమానుల పెత్త నమే సాగిస్తారో, అప్పీలుకు ప్రయత్ని స్తారో తెలియదు.

## కోకిల బార్

నెల్లూరుకు మరొక కొత్త 'బార్' వచ్చింది. కోకిల బార్ అండ్ రెస్టారెంట్ పేరుతో, శ్రీనివాస మహల్‌కు దగ్గర ప్రారంభించారు. 4 వేది జి. ప. ఛైర్మన్ శ్రీ యల్లసిరి శ్రీనివాసులురెడ్డి దీనికి రిబ్బను కత్తిరించారు. సముచితమైన ఎన్నికండి!

మాజీ స్పీకర్ శ్రీ రేబాల దశరథరామ రెడ్డిగారి మనుమడు, శ్రీ ఫణి ప్రసన్న కుమారరెడ్డి, ఆయన స్నేహబృందం దీనికి యజమానులు; వారికి మా విజయా కాంక్షలు.

## రైలుపెట్టెలో శవం

మద్రాసుకు వెళ్ళే బొకారో ఎక్స్ప్రెస్‌లో 2 వేది సాయంత్రం ఒక వృద్ధు రాలి శవం బయటపడింది. ఆ అభాగ్యు రాలెవరోకాని పాపం, చాలా క్రూరంగా, రాక్షసంగా చంపారు.

శవాన్ని తుండతుండాలుగా నరికారు. తర్వాత తల, మొండెం, చేతులు, తొడలు మోకాళ్ళనుంచి కాళ్ళు వేరుచేసి, విడివిడి పాత్రలలో వుంచారు. కొన్నింటిపైన బియ్యంపోసికప్పిపెట్టారు; మరికొన్నింటి చుట్టూ చింతపండు దట్టించి, సంచిలో దురిగారు. ఈ సంచులు, పాత్రలను రైలు జనరల్ బోగీలోకి ఎక్కడోఎక్కించి జంకెక్కడో దిగిపోయారు. సూళ్ళూరు పేట ప్రాంతానికి వచ్చేసరికి ప్రయాణీకు లకు దుర్వాసన కొట్టిందట. స్టేషన్ మాస్టర్‌కు ఫిర్యాదుచేస్తే, ఆయన పోలీ సుకు చెప్పారట. వారి సోదాలో ఇవన్నీ బయటపడ్డాయి. దానవత్వం మూర్తీభవిం చిన ఈ నరపశువులు ఎవరో ఇంకా తెలలేదు.

## ఆర్టీసీ సమావేశం

నెల్లూరు రీజనల్ ఆర్టీసి సూపర్‌వైజర్ల సంఘం సమావేశం 6 వేది హోటల్ సింహపురిలో జరుగుతుందని, రీజనల్ మేనేజరు శ్రీ మల్లన్న తెలియచేశారు.

## నీటిమట్టం

| | |
|---|---|
| కనిగిరి రిజర్వాయరు | 16.00 అ. |
| సర్వేపల్లి | 8.00 అ. |
| నెల్లూరు చెరువు | 14.95 అ. |

## నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకు (9672) (పుట్టి) | | |
| ,, | (పాతవి) | 1800-00 |
| ,, | (క్రొత్తవి) | 1340-00 |
| బి. ఆర్. 20 | | 1320-00 |
| పెసలు తూము | | 220-00 |
| ఉలవలు ,, | | 230-00 |

(పిల్లిపెసలు, మినుములు, ఇంకా మార్కెట్‌కు రాలేదు)

వేరుశనగకాయలు (10 కె. జి.) 42-50 (పుట్టి షుమారు రూ 1800-00)

## జిల్లావార్తలు

(7వ పేజీ కొరవ)

ఇప్పుడు గోలచేస్తున్నారు. ఈ నియా మకాలను రద్దుచేయమని వీరు కలెక్టరుకు ఒక వినతిపత్రంకూడా సమర్పించారట.

గూడూరు మునిసిపాలిటి పరిపాలన అవినీతిమురికిలో గొంతుదాకా కూరుకొని పోయివుంది; దానికి పుణ్యస్నానం చేయించి, శుభ్రంచేసే నాధుడే వున్నట్టు లేరు.

## పురిణి బస్సు సర్వే

పత్రికల అలజడి, గ్రామస్తుల ఆందో ళన ఫలితమేమో, కోవూరు తాలూకా పురిణికి రెండవబస్సు ఆవశ్యకతను పరిశీలించడానికి అధికారులు 1 వేది సర్వేజరిపారట. ఆర్టీసి గారే స్వయంగా వెళ్ళినట్లున్నారు.

సర్వేచేసి సరిపెట్టడంకాదు- తక్షణం అదనంగా ఒక కొత్త బస్సునయినా మం జూరుచేస్తే గామస్తులు కలెక్టరు, ఆర్టీసి లకు జేజేలుచెప్తారు; కలకాలం వారిపేరు గుర్తుంచుకుంటారు.





అళ్ళ సాంబశివారెడ్డి, రాజ్యలక్ష్మి [illegible]
వీరి వివాహం 17 వేది నెల్లూరులో జరిగింది







## ప్రథమ వర్ధంతి



మా తండ్రి

కీ. శే. బద్రి మల్లికార్జునయ్యగారి ప్రథమ వర్ధంతి

[illegible]-86 బుధవారం నెల్లూరు బృందావనంలో మా స్వగృహమునందు ఉ 9 30 గం.కు జరుపబడును.

మీరు దివికేగి సంవత్సరమయినా నిరంతరం శోకతప్త హృదయంతో నిన్నే ధ్యానించుతూ నీవు మా మనస్సులో ఉన్నావన్న ధైర్యంతో, ఆశీస్సులతో ముందుకు సాగుతూ మీకు శాంతి ప్రసాదించమని ఆ దైవాన్ని ప్రార్థిస్తూ అశ్రుపూరిత నయనాలతో బాష్పాంజలి ఘటిస్తూ

మీ కుమారుడు

బద్రి రాధాకృష్ణమూర్తి

మరియు కుటుంబ సభ్యులు.

శ్రీ మల్లికార్జున ఇంజనీరింగ్ కంపెనీ,
సజేదారుపేటరోడ్డు, నెల్లూరు.

# పినాకినీతీరం

(౨-వ పేజీ కొరవ)

## పాత్రికేయుడుగా గంగా రమణయ్య

గంగా రమణయ్య చాల కొద్దిమందికి పరిచయమునుంటాడు; జ్ఞాపకముంటాడు. వారికైనా ఆయన కమ్యూనిస్టుగానే పరిచయముంటుంది. జ్ఞాపకముంటుందికాని, ఆయన పాత్రికేయుడుకూడానని విషయం ఎక్కువమందికి తెలియకపోవచ్చు.

రమణయ్య జి. సి. కొండయ్యగారి తమ్ముడు. ఆ తర్వాత కాలంలో కమ్యూనిస్టుపార్టీ నిర్మాత జి. సి. కొండయ్య. అందువల్ల కొండయ్య బంధువులు, స్నేహితులు పెక్కుమంది కమ్యూనిస్టులయ్యారు. కమ్యూనిస్టు పార్టీ అభిమానులయ్యారు. రమణయ్య కూడా బహుశా కొండయ్యగారివల్లనే చిన్న వయసులోనే కమ్యూనిస్టు అయివుంటాడు. రమణయ్య పేరు మొట్టమొదటగా నేను విన్నది సువ్వూరుపాడుమీద కమ్యూనిస్టులు దాడిచేసినప్పుడు. ఆ దాడికి రమణయ్య నాయకత్వం వహించాడని జమీన్‌రైతు విశేషంగా ఆ దాడి సందర్భంలో సువ్వూరుపాడుకు పోయినప్పుడు నాకు తెలిసింది. రమణయ్య ఆవేశపరుడు, నిష్కపటి; అందువల్ల పార్టీలోకూడా తీవ్రవాది అయివుంటాడు.

పార్టీకి దూరమైన తర్వాత రమణయ్య నెల్లూరుకుచేరి 'జనవాణి' అనే పేరుతో ఒక వారపత్రిక నడిపాడు. ఆ పత్రిక దీర్ఘ కాలం నడవలేదు; నడచినంతకాలం నిజాయితీగానడచింది. రమణయ్య ఆవేశ పరుడు, నిష్కపటి అన్నాను; ఆ రెంటికీ మించినిజాయితీపరుడుకూడా. అన్యాయం అక్రమం ఎక్కడజరిగినా, అవినీతి ఎక్కడున్నా తనపత్రికలో అమాంతం విరుచుకపడేవాడు. రమణయ్య పాత్రికేయుడుగా వున్నప్పుడే ఆయనతో నాకు కాస్త పరిచయం.

'జనవాణి' ప్రారంభసంచిక ముఖపత్రానికి రమణయ్య జవహర్‌లాల్ నెహ్రూ బొమ్మ పెద్దది అడిగాడు; ఇచ్చాము. ఆయనతో నా తొలిపరిచయం అదే. నెల్లూరులోని ఒక పత్రిక వ్యక్తులను అప్రతిష్టపాల్జేసి బెదరించి డబ్బు గడిస్తుండేదట. ఒక వ్యక్తినిగూర్చి చెడ్డగా వ్రాయడం, అది పత్రికలో అచ్చుగాక ముందు, ఆ ప్రూఫులు ఎవరైనా దళారీ ద్వారా ఆ వ్యక్తికి చేరవేయడం, అతను భయపడి సంపాదకుడికి ఏదో దక్షిణ సమర్పించుకొని బయటపడడం అలవాటట. ఒకసారి ఒక వ్యక్తిని 'బ్లాక్ మెయిల్' చేయడానికి వుద్దేశించిన ప్రూఫును రమణయ్య ఎట్లనో సంపాదించాడు; తన పత్రిక 'జనవాణి' లో గుట్టు రట్టుచేశాడు! దాంతో ఆ సంపాదకుడు తనపత్రికలో రమణయ్యమీద నిరంతరం ధ్వజమెత్తేవాడు! ఆ ఇద్దరు సంపాదకుల మధ్య, ఆ రెండు పత్రికలమధ్య ద్వేషానికి అంతరంగిక కారణమేదైనా వుండినదేమో నాకు తెలియదుకాని, రమణయ్య చేసిన పనిమాత్రం అందరి ప్రశంసలకు పాత్రమైంది. ఎంతమందిపాత్రికేయులలో ఈనిజాయితీ వుంటుంది? నీతివుంటుంది? 'యల్లో జర్నలిజం' అంటూ మాటలలో అందరూ ఖండిస్తారు, నిరసిస్తారుగాని, అటువంటి జర్నలిజం బండారం బయట పెట్టడానికి ఎందరు శ్రమతీసుకుంటారు? ఎవరు సాహసిస్తారు? అటువంటి అసాధారణమైన పాత్రికేయుడు కాబట్టే గంగా రమణయ్య- ఆ సంఘటన నా స్మృతిపథంలో నిల్చిపోయాయి. జనవాణి పత్రిక వలెనే రమణయ్యా అకాల మృత్యువు పాలయ్యాడు; అయినా జ్ఞాపకమున్నాడు.

ఇప్పుడీ అసందర్భప్రస్తావన ఎందుకంటారా- పునర్‌పునర్ దర్శనక్రమంలో మరొకసారి పుట్టిన ఒక పత్రికను చూచినప్పుడు రమణయ్య నా మనసులో మెదిలాడు; అంతే!

నాగ









## •• సంస్మరణ

### సోమిరెడ్డి రాజగోపాలరెడ్డిగారు

[ శ్రీనివాసమహల్ రాజయ్య ]

మరణించి నేటికి మూడు సంవత్సరాలైనది

వారిని సంస్మరిస్తూ

వారికి మా ప్రగాఢ శ్రద్ధాంజలి

ఘటిస్తున్నాము.

-కుటుంబ సభ్యులు.

# పెండ్లిండ్లు

(౧వ పేజి తరువాయి)

### గూడూరు వివాహం

ఉత్తమ అధ్యాపకుడు, రిటైర్డ్ జూనియర్ కాలేజి ప్రిన్సిపాలు, గూడూరు వాసి శ్రీ ఎన్. వి. సుబ్రహ్మణ్యం పుత్రుడు, బెంగుళూరు యునైటెడ్ గ్లాస్ వర్క్సులో గ్లాస్ టెక్నాలజిస్టుగావున్న వెంకటశేషయ్య L. Cer. B., ఒంగోలు వ్యవసాయ శాఖీయుడు శ్రీ సూరంపాటి వెంకటేశ్వరశాస్త్రి పుత్రిక విద్యాధరి (బి. ఎ.) వివాహం 27 తేది వధువు ఇంట జరిగింది.

### 'తెలుగు గంగ' పెండ్లి

నెల్లూరు ఆర్. జ. గా ఆర్. అండ్ బి గెస్టుహౌస్ సేవలో అందరికీ సుపరిచితుడై, ప్రస్తుతం డిప్టీతాసిల్దారుగా తెలుగుగంగలో పునస్సానం చేస్తున్న శ్రీ అక్కరాజు రఘురామయ్య తనయ శోభ (బి. ఎస్‌సి); స్వర్గీయ రావినూతల నాగమల్లయ్య తనయుడు, విద్యానగర్ స్టేట్ బ్యాంకీయుడు ప్రసన్న కామేశ్వరరావు బి. కాం. వివాహం 28 తేది ఫండ్ ఆఫీసులో జరిగింది.

### ఆర్. ఎం. ఎస్. వివాహాలు

ఆర్. ఎం. ఎస్. ఉద్యోగే కాదు, అనుభవపరుడైన అనధికార జర్నలిస్టు శ్రీ మాచవోలు సుబ్రహ్మణ్యం పుత్రిక, స్పెషల్ ఉపాధ్యాయిని, మీనాకుమారి బి. కాం., శ్రీ కలవలపల్లి గుండూరావు పుత్రుడు, స్పెషల్ ఉపాధ్యాయుడు కె. వి. ఎస్. సత్యనారాయణరావు బి. ఎస్. సి, వివాహం 28 తేది స్పెషల్‌గా గాయత్రినగర్‌లో వధువు ఇంట జరిగింది.

• • •

శ్రీ పద్మా ఇంద్రసేననాయుడు కుమారుడు, స్టేట్‌బ్యాంకీయుడు మహేంద్ర బి. ఎస్‌సి., సిద్ధనకొండూరు- లక్ష్మీపురం ఖండ్రిక శ్రీ వెల్లంకొండ రోశయ్యనాయుడు కుమార్తె విజయలక్ష్మి బి. ఎస్‌సి. వివాహం కావలి శ్రీరాం మహల్‌లో జరిగింది.

### ఇంజనీరు పెండ్లి

పంచాయతీరాజ్‌శాఖ అసిస్టెంటుఇంజనీరుగా ఇందుకూరుపేట సమితిలో పని చేస్తున్న శ్రీ జి. నాగేశ్వరరావు 24 తేది ఝాన్సీని అర్ధాంగిగాస్వీకరించి గృహస్థు అయ్యారు.

వీరి వివాహం పశ్చిమ గోదావరిజిల్లా భీమవరంలో జరిగింది. సమితిలోని సర్పంచ్‌లు కొందరు నాగేశ్వరరావు పెండ్లికి అంతదూరం పోయివచ్చారంటే ఇంజనీరుగా అతను పాపులర్ అనేఅనుకోవాలి!

### మైపాడు పెండ్లి

మైపాడు, శ్రీ కాకుటూరు రామసుబ్బారెడ్డి కుమార్తె నివేదిత; మైపాడు, శ్రీ వేమిరెడ్డి వెంకటరమణారెడ్డి కుమారుడు నరేంద్ర రెడ్డి వివాహం 28 తేది నెల్లూరు టవున్ హాలులో జరిగింది.

పెళ్ళిళ్ళకు ఐశ్వర్య సొంత ఇళ్లు, స్వగ్రామాలు పనికిరావడంలేదు!

### యరబాక వివాహం

మానుగుంట సాహిత్యయజ్ఞంలో, ఇంగ్లీషు మేజరు కావడానికి అర్హమైన ఇరవైఒకటవ సంవత్సరం రాకముందు, దేశర్ల పంచాయతీసమితి అధ్యక్షుడుగా చేసి, ఆపిమ్మట తనదోటివాడికి గిట్టుబాటు కానివని రాజకీయాలకు స్వస్తిచెప్పి, తాతపర్తిగుండి నెల్లూరుకుమార్ పారిశ్రామికుడుగా ధనలక్ష్మి ఆదరణపొందిన నాగూరు మీరాసాహెబ్ భక్తుడు శ్రీ యరబాక కృష్ణారెడ్డి తనయుడు, ఇంజనీరింగు పట్టభద్రుడు మీరారెడ్డి బి. ఇ., జాలారుపేట నవాబుపేట చిన్నమెల్లాయవాసి శ్రీ సి. ఎం. వరదరాజులరెడ్డి కుమార్తె శైలజ కళ్యాణం 28 తేది మద్రాసు విజయరాణి మహల్‌లో జరిగింది.

ఏ ఆరేడు దశాబ్దాలముందే ప్రారంభమైన నెల్లూరు జోలారుపేట (కర్నాటక) సంబంధం పూర్తిగా తెగిపోకుండా కొనసాగుతూ వుండడం విశేషమే!

### రామపిచ్చిరెడ్డి కుమార్తె

పొదలకూరు స్వస్థానీయుడు, బిడిఓ గా సుపరిచితుడు,ప్రస్తుతం కడప డి.డి.ఒ.గా వుంటున్న శ్రీ జి. రామపిచ్చి రెడ్డి కుమార్తె డాక్టర్ మీన బి. డి. ఎస్., కొమ్మలపూడి, శ్రీ టి. వెంకటరామరెడ్డి కుమారుడు శేఖర్ బి. కాం., ఎ. సి. ఎ., ఎ. సి. యస్. పరిణయం 30 తేది నెల్లూరు టి. టి. డి. కళ్యాణమండపంలో జరిగింది.

### రేబాల-సవేర

నార్తుమోపూరువాసి, డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారి మేనల్లుడు, దైవభక్తి, వ్యాపానురక్తితప్ప మరో వ్యాపకంలేని సౌమ్యతముడు, వివాదరహితుడైన శ్రీ రేబాల వెంకటరెడ్డి తనయ ప్రజ్వల; మద్రాసు,సవేరాభాగస్వామి శ్రీ మాగుంట రామరాఘవరెడ్డి తనయుడు నరేంద్ర కుమార్ పరిణయం 30 తేది మద్రాసు శ్రీ రాజేశ్వరికళ్యాణమండపంలోజరిగింది

### హైదరాబాదు పెండ్లి

ఇరిగేషన్‌శాఖ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగానే సమర్థుడు, నిజాయితీగల ఆఫీసరుగా పేరుపొంది అకాలంగా కీర్తిశేషుడైన కాటంరెడ్డి లచ్చారెడ్డిగారి కుమారుడు ఆనందకుమార్; హైదరాబాదు, శ్రీ ఇ. ఎస్. రెడ్డి కుమార్తె పుష్పరేఖ పరిణయం 28 తేది హైదరాబాదు ఎ. సి. గార్డ్సులోని ఆఫీజ్‌మంజిల్‌లో జరిగింది,

### సుధాకర్ మెడికల్స్

నెల్లూరు సుధాకర్ మెడికల్స్ ప్రొప్రయిటరు శ్రీ సోమిశెట్టి సుబ్రహ్మణ్యం పుత్రిక వెంకటసుధారాణి; అన్నారెడ్డిపాళెం (బుచ్చి) శ్రీ దుగ్గిశెట్టి సుబ్రహ్మణ్యం పుత్రుడు సుబ్బారావు వివాహం మార్చి 23 తేది నెల్లూరు మాదాల బాలతిమ్మయ్య కళ్యాణ మందిరంలో జరిగింది.

### కడప పెండ్లి

చిత్తూరు ఆంధ్రబ్యాంకు మేనేజరు శ్రీ గరిక రామప్రసాదరెడ్డి తమ్ముడు జగన్; చిత్తూరు అడిషనల్ జిల్లా జడ్జి శ్రీ బి. ఈశ్వరరెడ్డి కుమార్తె పద్మలత వివాహం ఫిబ్రవరి 10 తేది కడప టి. టి. డి. కళ్యాణ మండపంలో జరిగింది. ★

# నెల్లూరు సంగతులు

(4 వ పేజి తరువాయి)

టెలికమ్యూనికేషన్స్ డిప్యూటీ జనరల్ మేనేజరు శ్రీ ఎం.డి. గోవర్ధన్ కూడా వుపన్యసించారు.

ఈ సంవత్సరం నెల్లూరులో కొత్తగా 400 ఫోన్లకు ఎస్ టి డి. సౌకర్యం కల్గించడమేకాక జూన్‌నుండి నెల్లూరునుండి కావలికి ఎస్. టి. డి. సదుపాయం కల్గించబడునని, ఈ జిల్లా వెనుకబడిన ప్రాంతాలలో పబ్లిక్ టెలిఫోన్లు ముందుకు వచ్చి టెలిఫోన్లు పెట్టుకోగలమని చెప్పిన బోటుల్లా ఎక్స్చేంజిలు పెట్టగలమని శ్రీ శ్రీనివాసన్ తన ప్రసంగంలో చెప్పారు.

నెల్లూరు టెలికమ్యూనికేషన్స్ డివిజనల్ ఇంజనీరు శ్రీ టి. కృష్ణమూర్తి సభ ప్రారంభంలో స్వాగతంచెప్పి, చివర్న వందనాలు సమర్పించారు. నెల్లూరు టెలికమ్యూనికేషన్ సౌకర్యాల విస్తరణలో శ్రీ కృష్ణమూర్తి వారి సిబ్బంది శ్రద్ధాసక్తులు అభినందనీయాలు.

### ఆరోగ్యవారోత్సవం

నెల్లూరు, ఇండియన్ మెడికల్ అసోసియేషన్‌శాఖ 4 నుంచి 8 తేది వరకు ప్రపంచ ఆరోగ్య వారోత్సవం జరుపుతుంది. ఈ సందర్భంగా స్వతంత్ర పార్కు ప్రక్కన దొడ్ల పద్మావతమ్మ మహిళా గ్రంథాలయంలో ఎగ్జిబిషన్, మెడికల్ చెకప్ నిర్వహిస్తారని, డాక్టర్ పూండ్ల శ్రీనివాసులురెడ్డి తెలియజేస్తున్నారు.

### కార్టూన్ల ప్రదర్శన

"సింహపురి క్రోక్విలర్" సంస్థ 29, 30 తేదులలో నెల్లూరులో ఒక మంచి కార్టూన్ల ప్రదర్శన నిర్వహించింది. టౌన్‌లో దాదాపు పాతికమంది పైగా కార్టూనిస్టులున్నారన్నవార్త, ఈ ప్రదర్శన చూచాకే తెలిసింది.

ఇందులో దాదాపు 300 కార్టూన్లు ప్రదర్శించారు: నెల్లూరు నుంచే కాక బయటి ప్రాంతాలనుంచికూడా వచ్చాయి. వీటిలో మూడొంతులభాగం- ముఖ్యమంత్రి రామారావుపైనే! వ్యంగ్యచిత్రకారులకు ఆయనెంత అభిమానపాత్రుడైనారో చూడండి! ఫిల్మోత్సవ్, నీటికరువు, తెలుగుగంగ వంటి సబ్జక్టులనుంచి, కుల మత భేదాలు, మూఢనమ్మకాల వరకు చాలా అంశాలనే ప్రస్తావించారు. కొన్ని కార్టూన్లు, మనసుకుహత్తుకునేటట్లు వుంటినాయి. ప్రదర్శనకు కొసమెరుపుగా, జయదేవ్ కార్టూన్లు కొన్ని ప్రదర్శించారు.

ఈ ప్రదర్శన చూడడానికి వేల సంఖ్యలో జనంవచ్చారు.

### రాజభవన్‌లో గ్రంథావిష్కరణ

మతసహనం, దేశసమైక్యతలకు దోహదకరంగా గీత - బైబిల్ - ఖురాన్ ప్రబోధాలను వుల్లేఖిస్తూ నెల్లూరు కె. ఎ. సి. జూనియర్ కాలేజి లెక్చరర్ శ్రీ నేలనూతల రామమూర్తి వ్రాసిన "త్రివేణీ సంగమం" అనే పుస్తకాన్ని 7 తేది హైదరాబాదులో రాజభవన్ నందు గవర్నరు శ్రీమతి కుముద్‌బెన్ జోషి ఆవిష్కరించారు; వున్నతాశయంతో గ్రంథరచన చేసిన శ్రీ రామమూర్తిని అభినందించారు.

ఈ గ్రంథావిష్కరణ కార్యక్రమంలో నెల్లూరు శాసనసభ్యుడు శ్రీ కె. వి. సుబ్బారెడ్డి కూడా పాల్గొన్నారు.

"త్రివేణీ సంగమం" పుస్తకాన్ని తిరగవేస్తున్న గవర్నరు కుముద్‌బెన్‌జోషి.-రచయిత రామమూర్తి, ఆయన సతీమణి సరోజనమ్మ

రామమూర్తిగారి కృషి ప్రశంసనీయం. కాని గ్రంథావిష్కరణ కోసం సకుటుంబంగా హైదరాబాదుకు పోయి గవర్నరుగారిచేత చేయించవలసిన అవసరం ఏమికలిగిందో అర్థంకాదు,

### తిక్కవరపు దంపతుల జయంతులు

సాహిత్యాభిమానంలో, వదాన్యతలో ఒకరికొకరు పోటీగా, సాటిగా జీవించిన దంపతులు-స్వర్గీయ తిక్కవరపు రామరెడ్డి, ఆయన సతీమణి స్వర్గీయ సుదర్శనమ్మ జయంతి సభలు 22, 23 తేదులలో జరిగాయి.

దొడ్ల పద్మావతమ్మ గ్రంథాలయంలో జరిగిన రామరెడ్డి జయంతిసభను, జిల్లా రిజిష్ట్రారు శ్రీ శంకరశర్మ అధ్యక్షించారు; సంస్కృత కాలేజి లెక్చరర్ శ్రీ కె. నరసింహారెడ్డి "కాళిదాసు కవితా వైభవం" గురించి ప్రసంగించి, డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి ద్వారా సన్మానం స్వీకరించారు. శ్రీ గోనుకొండ వెంకట సుబ్బయ్య షరా మామూలుగా స్వాగత వందనాలు చెప్పారు.

సుదర్శనమ్మ జయంతి, ఆమె పేరుతోనే వున్న మహిళాసంఘ భవనంలో జరిగింది. వర్ధమాన సమాజాధ్యక్షుడు శ్రీ మాడభూషి సుందరాచారి అధ్యక్షించారు. శ్రీమతి వింజమూరు సీతాదేవి రచించిన 'లాలి-తాలి' గ్రంథాన్ని డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి ఆవిష్కరించారు. నెల్లూరు జానపదగేయాల సంకలనం-ఈ గ్రంథం. గోపాలరెడ్డిగారి సతీమణి శ్రీమతి లక్ష్మీకాంతమ్మ, సీతాదేవిని సన్మానించారు. శ్రీమతి పైనాసు శీలమ్మ స్వాగతం, శ్రీమతి తాయారమ్మ వందనాలు చెప్పారు, శ్రీమతి మంకు సరళారామ్ నివేదిక చదివారు; శ్రీమతి డి. శకుంతల జాషువా పద్యాలు చదివారు. ★

# ప్రేక్షకులపై నెలకు పదిచిత్రాల దాడి!

బాపురంచందర్ హీరోగా "పరీక్షణ", కృష్ణంరాజు హీరోగా "రావణబ్రహ్మ", శోభన్‌బాబుతో శిష్యరంపు సుబ్బరామి రెడ్డి చిత్రం "జీవన పోరాటం", కృష్ణ, శ్రీదేవి జంటతో "జయం మనదే". బాల కృష్ణ హీరోగా "సీతారామ కళ్యాణం",

వుంటే ఇంకో చిత్రం చూస్తాడు. అలాం టప్పుడు మిగతా చిత్రాల గతేమిటి? ఈ విషయం నిర్మాతలకు తెలియనిదికాదు, వాళ్ళు చిత్రాలు నిర్మించేది ప్రేక్షకులను దృష్టిలో వుంచుకొనికాదు; కొనుగోలు దారులకోసం. కొనుగోలుదారులు చెప్పి

వాళ్ళింకా తమ రేట్లను పెంచేస్తారు. నిర్మాతకు చిత్రనిర్మాణవ్యయం మరింత పెరుగుతుంది. కొనుగోలుదార్లకు రేట్లు ఎక్కువచెప్తారు. కాని, ఇదివరకటిలా ఎంతరేటుచెప్తే, అంతరేటుకి కొనే స్థితిలో లేరు కొనుగోలుదారులు. ఒకసారి రేటు పెంచేసిన ఆర్టిస్టులు, టెక్నీషియన్లు తమరేట్లను తగ్గించటానికి ససేమిరాఒప్పు కోరు. అయినా, వాళ్ళకు నిర్మాతలు తలవంచక తప్పదు. ఇలావుంది తెలుగు చిత్రపరిశ్రమ ఇప్పుడు.

'వేట' లో చిరంజీవి, సుమలత జంట

భాలచందర్‌తో వాసంతి చిత్రం "మంచి మనసులు", వంశీ "ఆలాపన", చిరంజీవితో సంయుక్తామూవీస్ "వేట", భానుచందర్‌తో "దాగుడుమూతలు", మరి కొన్ని డబ్బింగ్ చిత్రాలున్నాయి ఏప్రెల్‌లో. సగటు ప్రేక్షకుడు నెలకు తొమ్మిది, పదిచిత్రాలు ఎలాచూడగలడు? ఏ రెండో మూడో చూస్తాడు. స్తోమత

తినిపోతే, కొత్తగా కొనేవాళ్ళు వేరేవస్తారు. వాళ్లుకూడా నష్టపడిపోతే?.... ఆ పరిస్థితే మళ్ళీ రాబోతోంది త్వరలో. ఇలాంటి పరిస్థితులు రావడం, పోవడం చిత్రసీమలో పరిపాటే. ఎటువంటి పరిస్థితి వచ్చినా, పోయినా- నిర్మాతలు చిత్రాలు తీస్తూనేవుంటారు. చిత్రాలు ఎక్కువయ్యే కొద్దీ ఆర్టిస్టులకు డిమాండ్ పెరుగుతుంది.

## 'మా అమ్మాయి ఎంత తొందర పడింది!'- సారిక తల్లి ఆవేదన

మా మద్రాసు సినీ ప్రతినిధి

"రాజ్ తిలక్" షూటింగ్‌సమయంలో కమలహాసన్‌ను, అతని భార్య వాణిని చూశాను. ఎంత ముచ్చటైన దంపతులు! వాళ్ళమధ్యచిచ్చుపెడుతుందానాకూతురు సారిక! మా అమ్మాయికి మూడేళ్ళయినా నిండకమునుపే నా భర్త నన్ను వదిలే శారు. అప్పట్నుంచి ఎంత కష్టపడి అల్లారుముద్దుగా పెంచి పెద్దదేశానో మా అమ్మాయికే బాగా తెలుసు. నేను సినిమాస్టార్‌చేయటానికి ఎంతశ్రమించానో కూడా తెలుసు. కమల్ మాయలోపడి వున్నట్టుండి నాదగ్గర్నుంచి చెప్పాపెట్టకుండా వెళ్ళిపోతుందా?" అని సారిక

—కొరవ 15 వ పేజీలో

# ఏడు గుర్రాల స్వారీతో కృష్ణ "సింహాసనం" ఎక్కాడు!

సమీక్ష
గిద్దలూరు గోపాలరావు

తెలుగులో తొలిసారిగా స్టీరియోఫోనిక్ 70 యం. యం. లో నిర్మించబడిన చిత్రం "సింహాసనం". పెద్దఎత్తున ఖర్చుపెట్టి ఇంకా పెద్దఎత్తున రాజభవనాల సెట్టింగులు ఏర్పరచి, గుఱ్ఱపుస్వారీలతో, రకరకాల యుద్ధాలతో, జిగేలుమనిపించే రాజుల, రాణుల అలంకరణలతో గంభీరంగా అలరారుతున్న యిలాంటి భారీచిత్రం తెలుగులో యిటీవలికాలంలో నిర్మాణంకాలేదనేచెప్పాలి. కృష్ణఇందులో ఒకే పోలికగల రెండు ముఖ్యపాత్రలు పోషించడమేకాక కథారచయితగా, దర్శకుడుగా, ఎడిటర్‌గా, నిర్మాతగా ఏడు గుర్రాల స్వారీచేసి సింహాసనాన్ని సాధిస్తాడు. అమ్జద్‌ఖాన్, వహీదా రెహమాన్, మందాకినిలాంటి హిందీతారలు ఇందులో నటించారు, దాదాపు మూడుగంటలు నడుసుందిచిత్రం. ఈ విశేషాలవల్ల "సింహాసనం" చిత్రం పద్మాలయావారి ప్రతిష్టాకరమైన చిత్రమని చెప్పకతప్పదు.

కథ జానపద ధోరణిలో నడిచిందని భావించవచ్చు. జానపదాల్లో పెద్దగా కథ లేదని, ఆకథలో లోపాలున్నాయని అనుకోవటం వెర్రిగావుంటుంది.

దశార్ణ రాజ్యంలో రాజుకు మగసంతానం లేదు. ఒక కుమార్తె (జయప్రద) వుంటుంది. తిరుగులేని వీరుడైన సేనాధిపతి విక్రమ్ (కృష్ణ) రాజ్యాన్ని కంటికి రెప్పలా కాస్తుంటాడు. ఆ రాజ సింహాసనంపై తన కుమారుని కూర్చోబెట్టాలని మంత్రి వేసంతామాత్యుడు (ప్రభాకర రెడ్డి)పన్నాగం పన్నుతుంటాడు. విక్రమ్‌పై హత్యానేరం మోపి దేశబహిష్కరణ శిక్ష విధింపజేస్తాడు. దేశం పొలిమేరలో దాగి సైన్యాన్ని కూడగట్టుకొని విక్రమ్ మంత్రి కుట్రను పడగొట్టి రాజకుమారికి పట్టాభిషేకం జరిపిస్తాడు.

ఇది యిలావుండగా పొరుగుదేశమైన అవంతిరాజ్యంలో యువరాజు (కృష్ణ) శృంగారలోలుడై పరిపాలన విషయం పట్టించుకోడు. అదేఅదనుగా మంత్రి మైన ఆదాక్కులంగదేవుడు (సత్యనారాయణ) తన చిన్నకుమారుని సింహాసనం ఎక్కించేందుకు ప్రయత్నిస్తాడు. యువరాజును చంపేందుకు ఒక విషకన్యను (మందాకిని) తయారుచేస్తాడు. ఇందులో నూ విక్రమ్ జోక్యంచేసుకొని యువరాజును అందగా నిలచి, అతన్ని రాజును చేస్తాడు. దుష్టులను శిక్షిస్తాడు. దశార్ణ రాజ్యం రాకు

మారి విక్రమ్‌ను వివాహమాడుతుంది.

కథలో రాజ్యాల పేర్లు, మంత్రుల పేర్లు నోరుతిరగని పాకంలో వున్నాయి. మహారథి ఆతితెలివికి ఇవి మచ్చుతునకలు.

వారసులకు సింహాసనాన్ని దక్కనివ్వకుండా, తమ కుమారులను సింహాసన మెక్కించేందుకు మంత్రులు పన్నిన కుట్రలు, వాటికి ఎదురుదెబ్బగా విక్రమ్

—కొరవ 15వ పేజీలో

# నామాట

(6 పేజీ కొనసా)

పక్షతో, నిర్లక్ష్యమో, తెలియదు-గాని, సంఘటన ఎంతపెద్దదైనా ప్రజాభిప్రాయం రూపుదిద్దుకోవడమూలేదు; అధవా ఏర్పడినా దానికి విలువా వుండడ లేదు.

ఈ నిరామయ వాతావరణంలో పోలీసు జులుంను - అదెంత అవసరమైనదైనా- సహించడం ఔచిత్యమనిపించుకుంటుందా? అసమ్మతి తెల్పితే, రౌడీలను ప్రోత్సహించినట్లవుతుందా? -ధర్మసంకటమే మరి!

ఈ అర్ధనగ్న ఊరేగింపుచూసిన ఒక మిత్రుడన్నారు- రౌడీలు మా మూర్ఖ దండితే ఇంతరచ్చ చేస్తున్నారు; మరి హోటల్ యజమానులు, వార్డ్ ప్రొప్రయిటర్ల నుంచి నిత్యం సరఫరాలు అందుకునే పోలీసులను ఎవరు దండించాలి- అని ప్రశ్నించారు; సి ఐ మురళిగారే దీనికి సమాధానం చెప్పాలి!

* * *

కొన్ని సంస్థలు, కొందరు వ్యక్తులు, కొన్ని సంఘటనలకు ప్రత్యేక ఆకర్షణ వుంటుంది. ఇంగ్లీషులో 'ఛార్మ్' అంటారే- అటువంటిదన్నమాట. నెహ్రూ, ఇందిరా గాంధీ వంటి నాయకులకు ఇటువంటి సమ్మోహనాశక్తి వుండేది. దేవాలయాల విషయంలో, దీనికి మరీ ప్రాధాన్యత ఎక్కువ.

దేవుడు ఒకడే. దేవాలయాల నిర్మాణంలో ప్రత్యేకత, లేదా పెద్ద తేడాలేమీ వుండవు; కానీ జనాకర్షణలో మాత్రం పోలికేవుండదు. తొ [illegible] హో లు వినాయకుడ్ని చూడండి - ఎప్పుడుచూసినా జనమే. రేవాల వెంకటరెడ్డి పంతులుగారి [illegible] శ్వర్లుకూడా నిత్యం గుంపులు దిస్తుంటా రక్కడ. నెల్లూరులో ఇంకెన్ని విఘ్నేశ్వరాలయాలు లేవంటారు? వాటి పూను పట్టించుకొంటున్నారా ఎవరైనా? ఒక్గా మిట్ట రాజేశ్వరాలయం సంగతి సరేసరి; అదొక యాత్రాక్షేత్రమైపోయింది.

పాతరోజుల్లో రంగనాయకులస్వామికి అంత గొప్ప సమ్మోహనాశక్తి వుండేది. తమిళనాడు ప్రాంతాలనుంచికూడా భక్తులు వచ్చేవారు. తిరుపతికి పోయే ప్రతి టూరిస్టుబస్సు - రంగడిని దర్శించి పోవలసిందే! 'పెన్నదాటితే పెరుమాళ్ల సేవ' అన్న సూక్తి వుండనేవుంది.

ఆరోజుల్లో రంగడి తిరునాళ్ళంటే- నెల్లూరులో ఇంటింటి పండుగ. టౌనంతా అంగళ్ళు, ఆఫీసులుకూడా మూతపడేవి. తాలూకాఫీసులో జరిగే సంత, వ్యవసాయ ప్రదర్శన ఇంకా పెద్దఆకర్షణ. తేరు వచ్చిందంటే, పిల్లల సంబరం చెప్పనవి కాదు. జనులు కిటకిటలాడిపోయేవి. రోడ్లు క్రిక్కిరిసినట్లుండేవి. అంతలావు రథాన్ని. అవలీలగా ఆటబొమ్మను తిప్పినట్లు తిప్పేవారు.

ఇప్పుడవన్నీ తల్చుకుంటే అందమైన కలగా కన్పిస్తాయి. రంగడితేరు, రంగనాయకులపేటకే పరిమితమైపోతూంది. టౌన్లో దాని ఊసెత్తేవారులేరు. అసలా రథోత్సవంలో 'ఛార్మ్' పోయిందా అనిపిస్తూంది. లేకుంటే, నాయకులవలెనే దేవుళ్ళకుకూడా 'సీజన్'లువుండి రంగడికిది సీజన్ కాకుండా పోయిందేమో!

ఈ ఏడాది కొత్తధర్మకర్తలమండలి అధ్యక్షుడు శ్రీ ఆనం వివేకానందరెడ్డి పేరున్న కళాకారులచేత పెద్ద పెద్ద వినోదకార్యక్రమాలు ఏర్పాటుచేసి, జనంలో పుత్సాహం కల్గించడానికి ప్రయత్నంచేసినమాట నిజమే; దానివల్లనో, లేక మరొక కారణంచేతనో ఈ తిరునాళ్ల ప్రజలలో కొద్దిగామెరుగు కన్పడినమాటా వాస్తవమే! అయితే అది ఆకాశవాణి చెప్పినట్లు 'ఐదులక్షలు' కాదు; 'ఈనాడు' పక్షి-చెప్పిన పదిలక్షలసలేకాదు. లెక్కల్లో ఇంతింత ఎక్కువ చెప్పడమెందుకు? ★

## పంచాంగం

### చైత్రమాసం

ఏప్రెల్ 10 వ తేది నుండి మే 8 వ తేది వరకు చైత్రమాసం.

### పండుగ

10-4-1986 వ తేది గురువారం తెలుగు సంవత్సరాది.

### వీక్లీ తిథులు

5 శని ఏకాదశి ప 10 56 గం. వ.
6 ఆది ద్వాదశి ప. 10.15 గం. వ.
7 సోమ త్రయోదశి ప. 9.43 గం వ.
8 మంగళ చతుర్దశి ప. 10.06 గం.వ.
9 బుధ అమావాస్య ప. 10.50 గం.వ.
10 గురు అక్షయనామ సంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమి ప 12 00 గం. వ.
11 శుక్ర విదియ ప. 1.38 గం. వ.

—[illegible]

సంపాదకుడు. ముద్రాపకుడు, ప్రకాశకుడు నెల్లూరు శ్రీరామమూర్తి, జమీన్ రైతు ప్రెస్. 17/170. ... 524001